# సతీదేవి

సరస్వతీ నికేతనము

వారిచే ప్రచురింపఁబడినది



మచిలీపట్టణము

౧౯౧౪

సర్వస్వామ్యసంకలితము.] [వెల రు. ౦-౮-౦.

# అంకితము

ఉదారహృదయులును, పావనచరితులును,

హితగుణశీలురునగు

మహారాజశ్రీ, కొడింబి — హనుమంతరావు

పంతులు, బి. ఏ., బి. ఎల్.,

గారికీ గ్రంథమును కృతజ్ఞతాపూర్వకముగ

సమర్పించుచున్నాను.

గ్రంథకర్త

# పీఠిక

వాగర్థా వివసంపృక్తౌ
వాగర్థ ప్రతిపత్తయే
జగతః పితరౌ వందే
పార్వతీ పరమేశ్వరా.

అష్టైశ్వర్య సంపన్నుఁడైన శివుఁడు కైలాసమును వదలి, అమరులకు నమృత మొసఁగి, తాను కాలకూటమును ద్రావి, జటాజూటమును ధరించి, పులిచర్మము గప్పుకొని, సన్న్యసియై, శ్మశాన వాటికను నివాసముగాఁ జేసికొనియెను. ఆ మహాపురుషుని భోగభాగ్యంబుల లక్షింపక, దక్షప్రజాపతి పుత్రికయగు సతి కేవలము సంపూర్ణానురాగబలంబున నాతని హృదయేశ్వరునిగ వరించి, అర్ధాంగలక్ష్మియై తనరుచుండె, కొంత కాలమునకుఁ బిమ్మటఁ దండ్రియగు దక్షుని యజ్ఞమున యవమానితయై, యోగాగ్ని వలనఁ బ్రాణంబులు

వాసి, నేలం గూలె. అత్తరి కైలాసమునఁ దపోనిష్ఠనున్న పరమేశ్వరుం డకారణముగఁ గనుదెఱచి, తత్తరమున లేచి 'సతీ! సతీ!' యని యెల్ల యెడల వెదకుచుఁ గాన లేక, ఇంతలో కనకఖలములోని యజ్ఞము స్ఫురణకు వచ్చి, యజ్ఞశాలకుం జని, అనురాగ వశంబునఁ బరవశుఁడై, సతీ కళేబరమును నాకట నిడికొని, ఆనందమై, స్వచ్ఛమై, అత్యంత పవిత్రమైన ప్రేమావేశమునఁ దన్మయతం జెంది, బ్రహ్మాండంబు కలయ నర్తనంబు సేసె.

అతఁడు పాదంబిడిన చోటెల్ల పావనంబయ్యె. ఆ నాట్యవేగంబునఁ బ్రేమా స్వరూపిణియగు సతియొక్క శరీరశకలంబులు భూనభోంతరాళము లెల్లెడ నిండి పవిత్రంబుగావించెను. అంతటఁ బరమేశ్వరుండు శాంతిఁ జెంది మరల సతితోడఁ గూడుటకుఁ దపోనిష్ఠనుబూని నైమరచెను. ఇదియె ఈ గ్రంథరాజము నందలి కథాసంగ్రహము.

పార్వతీ పరమేశ్వరులు పురాణ దంపతులు. ఈ యనాది జాయాపతులయందుఁ బరమోత్కృష్టమగు ప్రేమాతత్త్వము ప్రతిబింబితము. విశ్వవ్యాప్తమైన యీ మహోన్నతిభావము భరత ఖండమెల్ల యెడల నిండి, అనన్యమై, పావనమై, అర్ధనారీశ్వర స్వరూపమునఁ బూజ్యమై విలసిల్లుచున్నది. ఇంటింట శుభకార్యా

రంభమున "గౌరీపూజ" గఁ బరిణమించినది. ఈతత్త్వమే కవీంద్ర చంద్రుఁడగు కాళిదాసుని హృదయంగమునం బుపలబ్ధిం జెంది "వాగర్థావివసంప్రుక్తౌ" అను వాక్య రూపంబునఁ బ్రకాశితం బయ్యెను. ఈ పరమార్థమే యీగ్రంథమునందు మృదుమధురంబగు తెలుంగునఁ దేట మయ్యె.

గుంటూరు
1—8—15. } కొండ - వేంకటప్పయ్య.

—

ఓం

# సతీదేవి

## మొదటి ప్రకరణము

దక్షుఁడు మహదైశ్వర్య వంతుఁడు. తపోధనుఁడు. పరాక్రమశాలి. ఆతఁడు చేసిన యాగములు, యజ్ఞములు, దానధర్మములు, గణనాతీతములు. అందువలన దక్షునితోఁ దులతూఁగఁదగిన రాజు భూమండలమందు మరియొకఁడు లేకుండెను.

దక్షప్రజాపతి రాజధాని కనకఖలము. అది హరిద్వారము కడనున్నది. నిరుపమాన సౌందర్యముచే నలరారుచుండిన యా పట్టణము నేఁడు గాన్పింపకున్నను, ఆ ప్రదేశ

మిక్కుడును, ప్రకృతి సౌందర్యమువలన నద్వితీయమై యున్నది. దీని నానుకొనియున్న హిమవత్పర్వత శిఖరము లొకటికంటె నింకొకటి మించి చంచలములేని మేఘమాలికవలె గాన్పించుచుండును. ఆ మహాపర్వతరాజము నుండి గంగానది గొప్పసర్పమునుబోలి చుట్టిచుట్టి తిరుగుచుఁ బ్రబలవేగమునఁ గ్రిందికిఁ బ్రవహించుచుండును. ఆ దృశ్యమెంతయు హృదయ రంజకము గదా!

కనకఖలముకడ గంగానదీ శోభ వర్ణనాతీతము. అచ్చటి జలము స్ఫటికముభంగి స్వచ్ఛమై యొకచోట బాలవలెఁ దెల్లగను, మరియొక చోట గగనముపగిది నీలముగ నుండి, నదీ గర్భమందలి చిన్నచిన్న రాళ్లు గూడఁ గన్పట్టుచు నయనానందమును గలిగించుచుండును. గంగను జూడవలయుననినఁ గనకఖలము, లేక హరిద్వారమునొద్ద నంద

ర్శింపవలయును. అప్పుడే గంగా మాహాత్మ్య
ము హృదయంగమ మగును! అందువలననే
మహర్షులు ముగ్ధులై గంగా మతల్లి
నంతగా స్తోత్రము జేసియున్నారు. కనక
ఖిలము నానుకొని ప్రవహించు గంగానదిని
నీలధారయందురు. నవరత్న సుందరతమగు
దక్షప్రజాపతి సౌధరాజము దానియొడ్డుననే
యుండెను. వర్షాకాలమందా నీలధార దక్షుని
ప్రాసాదమునంటి ప్రవహించుచుండుటవలన
నచ్చటివారా ప్రవాహముయొక్క మృదు
మధుర గానమాలించుచు నిద్రించుచుండిరి.

దక్షప్రజాపతికి పుత్రికలు చాలమంది
కలరు. వికసితకమలములచే నొప్పారు సరో
వరమువలె దారకాగణముచే నలరారు
నాకాశమునుబోలి దక్షప్రజాపతి భవనము
పుత్రికామణులతోడ శోభిల్లుచుండెను. వారి
రూపలావణ్యములను, బాలక్రీడలను, గాంచి

తలిదండ్రు లానందమునం దోలలాడుచుండి రని వేఱుగఁ జెప్పవలయునా?

ఆ బాలికలు ప్రతిదినమును నీలధార కేఁగి స్నానమాడి, యెఱుపు, తెలుపు, పసుపు, నీలము మొదలగు రంగురాళ్లు నేరి వడియందు నైచుకొని, తమతమ రాళ్లు నొండొరులకుఁ జూపించుకొనుచు సంతసించుచు గృహమును జేరుచుండిరి.

ఒక దినమున రాజ మహిషియగు 'ప్రసూతి' సతినిజూచి నవ్వుచు నిట్లనియె. "అమ్మా! ఈ రాళ్లెందుకే? ఇంటినిండ వజ్ర వైడూర్యములు కొల్లలుగఁ బడియున్నవి గదా! అమ్మా! వానితో నాడుకోరాదా?" అని నుడువ సతీదేవి తాసేరుకొని వచ్చిన రాళ్లను ద్రిప్పిద్రిప్పి చూచుకొనుచు దానిమ్మ బీజములవంటి పలువరుస సుమధుర మంద హాసమునకుఁ దోడ్పడుచుండఁ దల్లి చేయిఁ





బట్టుకొని లాగుచు, 'కాదే. ఇది యెంత బాగుగ నున్నదో చూడు' అని నుడివి పరుగిడి యాటగదిలోనికేఁగి యచ్చట వరుసగ బల్లమీఁదఁ బెట్టియున్న విలువగల వస్తువులఁ బాఱవైచి, యాస్థానమందు తానేరి కొని వచ్చిన రాళ్లను బెట్టి చప్పట్లు జరుచుచు కూనరాగములఁ దీయుచుఁ బరమానందమును బొందుచుండెను.

మరియొక బాలిక తనబొమ్మలను వరుస పేళ్లు బెట్టిపిలచి మాట్లాడుచు నందొక బొమ్మను జూచి దాని యొడ్డనుంచిన రాయిని బట్టుకొని 'ఇది బాగుంది; అట్లాంటివి యింకా రేపు తెచ్చి పెడతానులే.' అనియు నింకొక బొమ్మవంక దిరిగి కరుణ రసముట్టిపడ 'అమ్మా! నీకిది కావలెనా! రేపు తెచ్చిపెడతాలే. యేడువకు' అనియుఁ గొన్ని బొమ్మల సంతోషమునకు సంతసించుచు, మరికొన్ని బొమ్మల యే







డ్పులకు విచారించుచు, అప్పుడే యొకబొమ్మ కోరిక నీడేర్చుటకు మరియొక బాలికను జూచి 'ఒసే అక్కా! నాకొక పచ్చరాయి యియ్యవే. నా అమ్మాయి యేడుస్తున్నదీ! మళ్లీ రేపుయిస్తాను.' అని యడుగ నాబాలిక 'ఉఁ - నేనియ్యను. ఇస్తే నాపాపాయి యేడ్వదూ ' అని నుడివెను. అంత నాబాలిక మూఁతి బిగించుకొని మహాగంభీరముగ నిమేషముండి చివ్వునలేచి పరుగిడి తల్లిని గౌఁగలించుకొని యటునిటు కదల నియ్యక, ఆమె నేత్రయుగళమునుండి ప్రవహించు వాత్సల్యామృత ధారలను బానముఁజేయుచుఁ గండ్లు ద్రిప్పుచు, తడఁబడుమాటల 'అమ్మా! అమ్మా! పచ్చరాయి యియ్యమన్నానే. అది యియ్యనన్నాదే. అఁ అఁ! నాకు ఇప్పించవూ! అమ్మా!' అని కొంగునడ్డుకొని లాగుచుండఁ బ్రసూతి యాబాలికను జంక నెత్తుకొని చెక్కిలినొక్కి



ముద్దాడి 'వెఱ్ఱిదానా! రాయియెందుకే? అంతకంటె మంచి రాయి యిస్తానుచూడు.' అని యొక పచ్చనిచ్చెను. కాని యా బాలిక దాని నటు నిటుఁ జూచి క్రిందఁ బడవైచి 'అమ్మా! ఇది కాదే. అక్కడదగ్గర నున్నదే అది.' అనినుడువుచుండఁ బ్రసూతి పుత్రికల కడ కేఁగి వారిబొమ్మల పెండ్లిండ్లు - విందులు- శయనగృహములు - పాన్పులు - వస్తువాహనములు - బొమ్మలఁగాంచి, వారి ముసిముసి నగవులు - ప్రసంగములు- మొదలగు వానిని జూచిన కొలఁదిని నామె వాత్సల్య రసము నూతనాకారమును దాల్చి వెల్లివిరియు చుండెను.

రాజమహిషి యానందము - ప్రేమపూరితమగు నామెదృక్కులు - అమృత మయమగు నావాక్కులు - ఆబాలికల వచ్చి రాని తియ్యనిపలుకులు - అస్ఫుటధ్వనులు - నగము

మ్రింగి మాట్లాడు వాక్య విన్యాసములు, ప్రశాంతమగు నాచూపులు - సంతోషములు - దీనాలాపములు - ఆటపాటలు - కోపతాపములు - బొమ్మలకు పాలిచ్చునప్పుడు తమ్మితరులు సూచుచున్నారని సిగ్గులు, - చిరునగవులు - వెక్కిరింపులు - మొదలగు దృశ్యములను వర్ణించు టెట్లు? ఆవిషయము సంతానవంతులగు తలిదండ్రులకే తెలియవలెను. చైతన్యము వెల్లివిరియుచుండు బాలికలకే యెఱుక పడవలయును. కాని యొక్కటి యున్నది. తల్లులు పిల్లల నారాధించుచుందురు. పిల్లలు బొమ్మల సేవించుచుందురు. ఏలయన; తల్లులు మాతృత్వము యొక్క విశ్వజనీ నావస్థను పిల్లలయందుపలబ్ధినొంది దాని నారాధించెదరు. ఆస్వాదించెదరు. తన్మయత్వము నొందెదరు. బొమ్మలకును తల్లులకును మధ్యనుండు స్థానము పిల్లలది. అక్కడ వారి

## మొదటి ప్రకరణము

నూతన సార్వజనిక మాతృత్వము పొంగి పొరలు చుండును. ముకుళించు కొనుచుండును. మరునిముసమునఁ దరంగతాడిత మగు మహాప్రవాహ సదృశమగు చుండును. అప్పుడది హద్దులను గమనింపదుగదా?

---

# రెండవ ప్రకరణము

దక్షుని పుత్రికలందఱిలోను సతీదేవి చిన్నది. అందువలనఁ దలిదండ్రులామె యం దెక్కుడు ప్రీతిగలిగి యుండుట సహజమేగదా. ప్రసూతిసతినిగాంచక యరనిముసమైననుండఁ జాలకుండెను. దక్షుఁడు రాజ్యభారమును మంత్రులపై నునిచి యెల్లప్పుడు సతితోడనే కాలము గడుపుచుండెను. ఆరాజదంపతు లప్పుడు సతీదేవి యొక్క మూర్తీభవించిన మాతృభావమునుగాంచి, యామె తమపుత్రిక యనుజ్ఞానమును మరచి, తామామె సంతాన మని తలంచి సేవించుచుండిరి. అందువలన నాదంపతుల నోట 'అమ్మా' యనుమాట తప్ప మరి వేఱుమాట రాకుండెను.

సతి కిశోర వయసునందుండి ముగ్ధాత్వము నకుఁ దార్పంబడెను. ఆ వయసునందలి ధీరతయు, లజ్జయు, సతిని మరింత సుందరవతిగ నొనర్చుచుండెను. సతి రూప గుణములయందసమానురాలు. కాని, యామె సౌందర్యము శరీరచ్ఛాయనుబట్టి గాని, ముక్కు చెవులు మొదలగు వాని పొందిక ననుసరించిగాని, యుండలేదు. సతీ సౌందర్య మామె నాశ్రయించి వెలుంగు ప్రకాశమందుండెను. ఆమె మాతృభావమం దుండెను. అందు వలన నామెను గాంచిన వారెల్లరు ముగ్ధులగుచుండిరి. సన్న్యాసులు మొదలగువా రామెను జూచినంతనే జగన్మాతయని తలఁచి మనము నందు వందనము లర్పించుచుండిరి.

ఈమె గురుజనుల సేవింపుచు, కోపతాపములెఱుంగక పరమానందమున మెలంగు చుండెను. దాసీదాసులు బంధువులు మొద

లగు వారిమీఁదఁగాని, జరాజీర్ణులు, రోగులు మొదలగు వారిపైఁ గాని యెప్పుడును కరుణను జూపి - కాదు - ప్రేమనే ప్రవహింపఁ జేయుచుండెను.

అందువలన నీమె నెల్లరు "ప్రేమామయీ." యని పిలుచుచుండిరి. దక్షుని పుత్త్రికలలో సతికిని మిగిలిన వారికిని స్వభావమున మిక్కిలి భేదముండెను. వారందఱు వెలగల వసనభూషణముల యందెక్కుడనురాగము గలిగియుండిరి. కాని, సతి వస్త్రాభరణములవంకఁ గన్నెత్తి చూచియైన నెఱుఁగదు. వారిలో గొందఱు, ఇంద్ర ధనస్సువంటి పలు వన్నియల వస్త్రములను, మరికొందఱు, ఆకుపచ్చ, పసుపు, నీలము, మొదలగు దుకూలములను బ్రేమించుచుండిరి. కాని సతికిఁగాషాయవస్త్రములు మిక్కిలి ప్రీతి గొలుపుచుండెను. వారి కంఠములయందు మణిమయ

హారములును, ముత్యాలసరములును, చేతు
లకు నవరత్న స్థగితమగు కంకణములును
బ్రకాశింపుచుండెను. ఈమె కంఠమందు
స్ఫటికపుఁ బూసలును, హస్తములకు రుద్రాక్ష
వలయములుండెను. వారు మంచి గంధము
పునుగు జవ్వాజి మొదలగు పరిమళ ద్రవ్యము
లను శరీరమం దలందుకొనుచుండిరి. ఈమె
శరీరమంతటను విభూతిఁబూసికొనుచుండెను.
దాసీ లీమెతల నెంతో ప్రయత్నముతోడ
దువ్వి ముడివైచినను, అప్రయత్నముగ నా
ముడి వీడి క్రిందికి జారుచుండెను. మరియు
జడలుగట్టుచుండెను. ప్రసూతి పుత్రిక వేష
మును గాంచి మిక్కిలి చింతింపుచుండెనని
చెప్పుట యందాశ్చర్య మేమున్నది? వసన
భూషణధారణమునను, శరీరపోషణయందును
నుదాసీన భావముగల ముగ్ధాత్వమందలి పుత్రి
కనుగాంచి యేతల్లి సహించి యుండఁగలదు?

అప్పుడప్పుడామె సతినిజూచి యిట్లను చుండె. "అమ్మా! నీకేమిగోదువ. పెద్దదాన వగుచున్నావుగదా! ఈ పిచ్చివేషమేమి? మంచిమంచి వస్త్రములఁ గట్టుకొనరాదా? విలువగల భూషణముల ధరింపరాదా! చక్కఁగాఁ దలముడుచుకొనరాదా! నీ యాకారమునుజూచిన వారేమందురు? 'పిచ్చిది. వెఱ్ఱిది.' అని యనరా? నిన్నెవ్వరు పెండ్లి యాడుదు రమ్మా?"

తల్లిమాటలకు నవ్వుచు సతీదేవి యిట్లను చుండె. 'అమ్మా! బాగుగనున్నది. ఎప్పుడు నీ యొద్దనే యుందును.' అని నుడువుచు నామెను కౌఁగలించుకొను చుండెను. దక్షుఁడుకూడఁ గుమార్తె వేషమునుగాంచి విచారపడుచుం డెను. కాని యాయన, ఆ ప్రేమామూర్తిని, ఆ యానందరాశిని, ఆజగన్మాతృ స్వరూపిణిని, గాంచి యేమియుఁ బలుకఁజాలకుండెను. సతీ

మనంబునకే మాత్రము నొప్పిగలిగిననుగూడ నామె కలువరేకులవంటి కన్నులనుండి జలజలమని యశ్రుబిందువులు స్రవించుచుండెను. అందువలన దత్తుఁ 'డీ పిచ్చిదానికి భర్తగూడ పిచ్చివాఁడు లభింపకుండు గాత' యని యీశ్వరుని బ్రార్థించుచుండెను.

---

## మూఁడవ ప్రకరణము

సతీదేవికిఁ బదునాలు వత్సరములయి నంతనే యొక యోగినివచ్చి దక్షుని గృహ మున నివసించుచు, ప్రసూతిని 'అమ్మా' యని పిలుచుచు, సతిని మిక్కిలి ప్రేమించుచుం డెను. సతి యోగినిని 'అక్కా' యనికాక మరివేఱువిధమున సంబోధించి యెఱుంగదు. సతి యోగిని పదాంకముల ననుసరించి ప్రవ ర్తించుచుండెను. ఆమె శిక్షవలనను, సహ వాసము వలనను, సతీ విశ్వజనీన మాతృ త్వము వికసింపసాగెను.

యోగిని బిల్వ వృక్ష మూలమందుఁ గూర్చుండి 'హర హర' అని శివుని నారాధిం చునప్పుడు సతి యానందమొందుచు, తాను

గూడ 'హర హర' అని నుడువుచుండెను. యోగినితోడ శివస్తోత్రమును బఠింపుచు, పరమానంద భరితమైతన్మయత్వము నొందుచుండెను. మరియు శివతత్త్వమును గ్రహించుటకుఁ బ్రాణపణముగఁ బ్రయత్నించుచుండెను. అప్పుడప్పుడు యోగిని శివతత్త్వమునుగూర్చి చెప్పుచుండ సతీదేవి యా విషయమును వినుచు, 'హర హర!' యని నుడువుచు నైమరచుచుండెను.

ఒక దినమున యోగిని సతిని జూచి యిట్లు సెప్పఁదొడంగె. "అమ్మా! సతీ! శివుఁడనాది దేవుఁడు. దేవతలందఱలో శ్రేష్ఠుఁడు. అందువలన 'దేవాదిదేవ, మహాదేవ' యను నామములు లభించినవి. ఆయన మంగళమయుఁడు. ఎప్పుడును జగత్కల్యాణముకొఱకుఁ బ్రయత్నింపుచుండును. కావున 'శివ' అను నామము లభించినది. అతఁడు, సమస్త

మును మరచియెల్లప్పుడు యోగమందుండును. కాఁబట్టి యోగీశ్వరేశ్వరుఁడను పేరువచ్చినది. ఆహా! ఆ నామధేయ మెంత మధురమైనది. ఆ మహానుభావుఁడు రాగద్వేషరహితుఁడు గదా! దేవతలకు స్వర్గమొసంగి తాను శ్మశానమునాశ్రయించెను. వారి కమృతమొసంగి, తాను విషమును గ్రోలెను. అందువలన వారమరులైరి. ఆతఁడు నీలకంఠుఁడాయెను. ఆ మహాపురుషుఁడు స్వసుఖమునుగూర్చి యణుమాత్రమైనను యోచించుకొనఁడు. ఎప్పుడును పరులకు మంగళములను గూర్చుచుండును. ఆహా! అట్టి పరోపకార శీలురెవ్వరున్నారు?”

యోగిని యుపదేశ వాక్యములు వినినకొలఁదిని సతీదేవి నేత్రములు వారి పూరితములై యాకుల హృదయమున యోగినిని జూచి యిట్లనియె. “అక్కా! ఆయనకుఁజుట్ట

పక్కమము లెవ్వరు లేరుగదా! ఎప్పుడు శ్మశాన మందే నివసించుట యెంత కష్టము? నాలుక యెండ్చుకొని పోవుచున్నప్పుడు, గ్రుక్కెడు నీళ్లిచ్చువారుగాని, కడుపు కాలుచున్నప్పుడు పిడికె డన్నముఁ బెట్టువారుగాని, ఎండ వానలకు తలఁదాఁచుకొనుటకుఁ జిన్నకుటీరమైనను లేదు గదా? అయ్యో! పాపము! ఆయన యెట్టి కష్టము లొందుచుండును? కాని మన కాయన దర్శనము లభించదాయె. అక్కా! నా కేమాట చెప్పుఁ. నే నా మహానుభావుని నెట్లు సూడఁగలను? ఈ పుష్పహార మాయన కంఠమం దలంకరించి శిశ్రూషఁ జేయవలయు నని నా మనము తొందరపడుచున్నది. అక్కా! నా కోరిక నీడేర్పవు? ఆ శ్మశానవాసి యగు సన్న్యాసిని గృహస్థునిగఁ జేయుదము."

యోగిని :- అమ్మా! శివుని యందు నీకుఁ గల యనురాగము నిరుపమానము.

అందువలన నాతఁడు నీకు శీఘ్రముగ దర్శన మిచ్చును. కావున నీ వాయనను బూజింపుము. ధ్యాన ధారణ లొనర్పుము. అప్పుడు నీ కాయన ప్రత్యక్ష మగును.

సతి:-అక్కా! ఆయన యెచ్చట నుండును? ఎక్కడ కేఁగిన నాయనను జూడవచ్చును? ఇఁక నే నాయనను దర్శించక యుండఁ జాలను.

యోగిని:-అమ్మా! నీవు పసిదానవు. తొందర పడుటవలనఁ బ్రయోజనము లేదు. స్థిర చిత్తమున నా జటాజూటు ధ్యానింపుము. అప్పు డాయన నీకు దర్శన మొసంగును. ఆ మహా పురుషుని జూచుటకు నీ వింకొక చోటున కేఁగవలసినపని లేదు. ఆతఁడు సర్వత్ర నిండియున్నాఁడు.

అని నుడివి యోగిని సతీదేవిచేత యోగాభ్యాసము సేయింపసాగెను. సతి క్రమ

ముగా యోగాసనమం దుండి శివుని నారా
ధించుటకు నభ్యసించెను. సతి యనుదినము
ను, యోగమం దుండి యేకాగ్రచిత్తమున,
'ప్రభో! దేవాదిదేవా! మహాదేవా! దర్శన
మొసంగి నన్నుఁ గృతార్థురాలనుగ నొనర్పు
ము. నే నొసంగు నీ పుష్పహారమును గైకొను
ము.' అని ధ్యానించుచుండెను. పరమేశ్వ
రుఁడు భక్త కల్పతరువు. కావున భక్తుల
ప్రార్థనను వినుచు నూరకుండఁ గలఁడా!
కావున శివుఁడు ప్రత్యక్షుఁడై 'సతీ! పుష్ప
మాల నొసంగుము.' అని నుడివెను. అంత
నామె యాతని కంఠమందుఁబుష్ప హారము
నిడి తెప్ప వాల్పక చూచుచు, రజతగిరి
సన్నిభుండగు నా మహాదేవుని పాదపద్మ
ములయం దాత్మను సమర్పించి ముద్దరా
లయ్యెను. మహాదేవుఁడు,సతీ దేవి మనఃప్రాణ
ములఁ గైకొని యదృశ్యుఁ డాయెను.

అప్పుడు సతి హృదయము శూన్య మాయెను-యోగభంగము గలిగెను - అంధ కారము గప్పెను - మూర్ఛిల్లెను. అప్పుడు యోగిని ప్రయత్నము వలన సతికి బాహ్యా జ్ఞానము గలిగెను-కాని శాంతి మాత్రము గలుగలేదు-ఎచ్చటనో చూచుచుండెను. శరీ రము కంపించుచుండెను - కన్నీరు కాల్వలై ప్రవహింపసాగెను.

యోగిని, సతి హస్తమును బట్టుకొని యామెను వేఱు విషయములోనికి దింపి ప్రసూతి కడకుఁ దీసికొని యేఁగెను.

———

## నాలుగవ ప్రకరణము

దక్షప్రజాపతి పుత్రిక లందఱకు వివాహ మయ్యెను. వారంద ఱత్తవారిండ్లకేఁగి సుఖముగఁ గాపురములఁ జేయుచుండిరి. సతి యందఱకంటెను జిన్నది. ఆమెకు మాత్రము వివాహముకాలేదు.

ఇప్పుడు సతీదేవి వివాహ యోగ్యయయ్యెను. ఆమెను దగిన వరునకిచ్చి మహా వైభవముతోడ వివాహముఁ జేయవలయునని రాజదంపతు లువ్విళ్ళూరుచుండిరి. ఒకదినమున వరాన్వేషణమునకేఁగిన నారదుఁడు వచ్చి దక్షప్రజాపతికి నమస్కరించి యిట్లనియె. మనసతీదేవికిఁ దగినవరునిగుదిర్చితిని. అట్టి వాఁడు భూమండలమందు మరిలేఁడు.

దక్షుఁడు:-వత్సా! నారద! ఆతని పేరేమి? నివాసస్థలమెచ్చట?

నారదుఁడు:-ఆతఁడు కైలాస పురాధీశ్వరుఁడు.

ఈ మాట వినినంతనే దక్షుని మోము కొంచెముచిన్నవోయి యేదియో ప్రశ్నించఁబోవు నంతలో రాజమహిషి. యిట్లనియె. "కైలాసపురమా! అది చాలదూరము. అంత దూర మిచ్చినయెడల సతీ సమాచారమెప్పటి కప్పుడు నాకుఁదెలియుటకు వలనుగాదు. అది నాకుఁ బ్రతిదినము గనుపడునట్లు లుండవలయును."

నారదుఁడు:-రాణీ!దూరమైననేమి?నీకేమి కొదువ? సతీ యోగక్షేమ మెప్పటి దప్పుడు కనుగొనుటకు నీకు మనుష్యులు లేరా? వాహనములు తక్కువా! కాని సతి యెల్లప్పుడు నీకుఁ గనఁబడుచుండుట ముఖ్యమా? దానికి

మంచి సంబంధము దొరకుట ముఖ్యమా? అది సౌఖ్యముగఁ గాపురము సేయుచున్న యెడల దానిని నీవు చూడకుండిన నీకు ముగఁ గలుగు నష్టమేమి?

దక్షుఁడును, ప్రసూతియు యోచించుకొని నారదుఁడు సెప్పినమాటలు బాగుగనున్నవని తలఁచి దూరమైనను కైలాసనాథున కిచ్చి సతికివివాహము సేయవచ్చు ననుకొని దక్షుఁ డిట్లనియె:-

'వత్సా! నారద! అతఁడు విద్వాంసుఁ డౌనా?'

నారదుఁడు:-ఆయన సర్వవిద్యాపారంగ తుఁడు. వసిష్ఠ మహర్షిని మీ రెఱింగియె యున్నారు గదా; అతఁడు కైలాసనాథుని యొద్దనే, ఋగ్యజుస్సామముల నభ్యసించెను. మహాపరాక్రమసంపన్నుఁడగు పరశురాముఁ డాయనకడనే యథర్వణ [illegible]

కొనెను. నాకాయనయే గాంధర్వవిద్యా శిక్ష నొసంగెను.

అను వాక్యములు వినుచు సంతోషించుచు దక్షుఁ డిట్లనియె:-కాని నారదా? ఆతఁడు భుజబల సంపన్నుఁడౌనా?

నారదుఁడు:-ఆయన ధరించు ధనుస్సును బినాకమందురు. ఆ పినాకమందు బాణము సంధించుమాట యటులుంపుఁడు. దానినెత్తఁ గలవాఁడైనను భూమండలమందు మరిలేఁడు. ఆవింటితోనేగదా కైలాసనాథుఁడు త్రిపురాసురుల సంహరించినది.

రాజమహిషి:-నారదా! ఆయన సుందరాకారుఁడేనా?

నారదుఁడు:-రాణీ! ఆవిషయమునుగూర్చి యేమి చెప్పుదును! ఆయన దృఢోన్నతగాత్రుఁడు. బాహువు లాజానులంబకములు. ఆకర్ణాంతములు లోచనములు. రజితగౌరము

వర్ణము. సర్వదా ప్రసన్నవదనము. అట్టి సౌం
దర్యవంతుని నేనెక్కడను జూడలేదు. మరి
చూడఁబోను. ఆయన యంకమందు మన
సతియుండుట కర్హురాలు.

రాజమహిషి:-ధనవంతుఁడా?

నారదుఁడు:-రత్న గర్భయగు కైలాస
రాజ్యమున కాతఁడురాజు. యక్షరాజగు
కుబేరుఁడాయన ధనాగారమున నధిపతి. ఇఁక
ధనమున కేమిలోపము? అయిశ్వర్యమున కేమి
కొఱంత?

ఈ విషయమం దింతకంటెఁ బసూతికిఁ
జెప్పనావశ్యముగాదు. ఏలయన; రత్నముల
యందత్యంత ప్రీతిగల రాణి కుబేరుని నామ
ధేయ మెఱుంగదా ; అందువలన నామె
మిక్కిలి సంతసించి తిరిగి యిట్లనియె ?
'ఆయనకు తలిదండ్రులు మొదలగువా
రున్నారా ?'

నారదుఁడు చిరునవ్వునవ్వుచు నిట్లనియె! ఆయనకుఁ దలిదండ్రుల వంకవారెవ్వరును లేరు. అదియొక లోపమే. కాని వివాహమైనంతనే మన సతి కైలాసమునకు సర్వేశ్వరి యగును.

ఈ మాటలకుఁ బ్రత్యుత్తరం బొసంగక రాజమహిషి మౌనమును ధరించి చూచుచుండ నారదుఁడిట్లు చెప్పందొడంగెను. "రాణీ! ఇంకను నేనొకటి రెండు సంగతులు చెప్పవలసియున్నది. అవి యిప్పుడే చెప్పుటయుత్తమము. వాని మంచిచెడుగులను మీరే యోచింపుకొనుఁడు. తర్వాత నన్ను నిందించినఁ బ్రయోజనములేదు. కైలాసపతి సంసార సంబంధమునందు సంపూర్ణముగ నుదాసీనుఁడు. ఆయనకు గృహము శ్మశానము. విభూతి మంచిగంధము. ఆయన యెప్పుడును యోచనానిమగ్నుఁడై యుండును. ఆ

నిమగ్నత జగత్కల్యాణము కొఱకుఁగాని
స్వసుఖముకొఱకుఁ గాదు. ఆయన శ్మశా
నముల యందలి శవములను బరీక్షించుచు,
అరణ్యములయందలి వృక్షముల గుణాగుణ
ములను విచారించుచు, గిరిగహ్వరముల కేఁగి
యోగతత్త్వమును నిరూపించుట తోడఁ గాల
ము గడుపుచుండును. తత్త్వనిరూపణ కొఱ
కాయన కాలకూట మును ద్రాగుటకుఁ
గాని, ఘోరవిష సర్పముల ధరించుటకుఁగాని
వెనుదీయఁడు. ఇందువలన నీయన సంసారి
యైననుసన్న్యాసి. మహారాజైనను భిక్షుకుఁడు.
రాణీ! వరుని గుణాగుణములఁగూర్చి యున్న
దున్నట్లు సెప్పితిని. తర్వాత మీ యిష్టము.'

నారదుని వాక్యములు విని ప్రసూతి
మౌనమును ధరించియుండ నొక ప్రవీణురా
లగు దాసి ప్రసూతిని జూచి యిట్లనియె.
'అమ్మా! మీ రేల యోచించెదరు? తలిదం

త్రులు లేనివారికి మనస్తృప్తిమితము కొంచెము తక్కువగనుండును. అందువలన వారు చెట్టు పుట్టలు పట్టి తిరుగుచుందురు. కాని మన సతి తెలివిగలదైనచో, కైలాసనాథుని నీ యిష్టము వచ్చినటు లొక్క నెలలో నడి పింపదా?'

ఈ మాటలకు రాణి సంతృప్తినొంది "సర్వ గుణ సంపన్నుఁడగు వాఁడెచ్చటనుండును? దాసీ! తగిన సంబంధముఁ గూర్చుట మా పనిగదా! తర్వాత దానియదృష్టము. కావున రూపగుణైశ్వర్యములయం దసమానుఁడగు కైలాసనాథుని హస్తములలో సతిని బెట్టుట యుత్తమము. కాని మహారాజుగారి యభి ప్రాయమేమో" అని దక్షప్రజాపతి వంకఁ జూచెను.

దక్షుఁడు:-రాణీ! నొసటి వ్రాలుదుడుచు టకేరితరము? ఈ పిచ్చిది యే పిచ్చివానిచేతి

యందుఁ బడునోయని మొదటనుండియు నేను భయపడుచుంటిని. ఇప్పుడు నే ననుకొనినట్లే యైనది. ఏమయినఁ గాని, నేనుగూడ సమ్మతించుచున్నాను.

తథాస్తు. సతిని కైలాసనాథునకిచ్చి వివాహ మొనర్చుట నిశ్చయము.

అప్పటినుండియు రాజదంపతులు వివాహ ప్రయత్నములు సేయసాగిరి.

---

## ఐదవ ప్రకరణము

సతీదేవి వివాహమునకు దక్షుని బంధువులు మొదలగువారు వచ్చిరి. రాజభవనము దీపమాలికలచేత దేదీప్యమాన మగు చుండెను. రాజపుత్త్రికలు సుందర వసనభూషణములధరించి యటునిటుఁ దిరుగుచుండిరి. వివాహమంటపమునకుఁ గైలాసనాథుఁడు వచ్చెను. ఆయనను గూర్చి నారదుఁడు సెప్పినవిషయమంతయు సప్రమాణ మయ్యెను. కైలాసనాథుని పూర్ణచంద్రునివంటి మోము జటాజాలములమధ్యఁ బ్రకాశింపఁజొచ్చెను. విభూతి లేపమువలన రజత గౌర శరీరము మరింత శోభిల్లుచుండెను. కైలాసనాథుని జూచి రాజ

మహిషియుఁ దక్కుం గలవారును ముగ్ధులైరి. పురాంగన లేకగ్రీవముగ 'మన సతికిఁదగిన వరుఁడు లభించె' నని పలుకసాగిరి. కాని యొకవిషయమందుమాత్రము రాణి మిక్కిలి విచారపడుచు, నిట్లు తలపోయఁ జొచ్చెను. 'కైలాసనాథుఁడు మహదైశ్వర్యవంతుఁ డని నారదుఁడు సెప్పెను గదా! ఆమాట లసత్యములా!' అని యనుకొనుచుఁ బురాంగనలఁ జూచి యిట్లనియె. 'అదేమి వేషమమ్మా! ఇది వివాహసమయము గదా! సతికిఁగూడ నా రుద్రాక్షలు— ఆ విభూతి— ఆ చర్మాంబరములేనా? ఒక్క మంచి దుకూలముగాని, యొక్క మంచి నగగాని, తీసికొని రాకూడదా? మహదైశ్వర్యాన్వితుం డని నారదుఁడు సెప్పెను. ఐశ్వర్యమటుంపుఁడు.సన్న్యాసివలె నున్నాఁడు. నారదుఁడసత్యములాడునా? ఆడడు. కాని యాయనకు సంగతి సందర్భములు

దెలియకుండవచ్చును...' అని యేమేమో చెప్పి విచారింపుచుండ నొక వృద్ధాంగన యిట్లనియె. 'అమ్మా! రాణీ! ఆయనకుఁ దలిదండ్రులు లేరు గదా! వివాహమున కలంకరించి పంపించువా రెవ్వరు? తనంతట తా నలంకరించుకొనిరాఁడు గదా! అందువలన నాతనికాచారమైన వేషమున వచ్చినాఁడు. తనకుఁ దోఁచినవి తెచ్చినాఁడు. ఇక్కడకుఁ దేకున్న నేమి? ఆయన యైశ్వర్యమంతయు మన సతిది కాదా?

మరియొక స్త్రీ యిట్లనియె:-మన సతి మిక్కిలి యదృష్టవంతురాలు. అందు కణుమాత్రమైనను సందియము లేదు. కాని మీది రాజసంసారము గదా! సతికి లోపమేమున్నదమ్మా! ఇట్టి బాలిక నొక్కదానినే కాదు. వేయిమంది నలంకరింపవలయు నని నను మీ కొక లెక్కయా?

కాని, యీమాటలవలనఁ బ్రసూతి యూరడిల్లుటెట్లు? ఆమె నారదుని బిలచి యిట్లనియె. 'నారదా! నీ వీయనను మహదైశ్వర్యాన్వితుఁడని చెప్పితివి. కాని చూచినవా రెవ్వ రైశ్వర్యవంతుఁడనుకొందురు? మీఁదు మిక్కిలి సన్న్యాసి యని తలఁచుట కేమైన సందియమా? చివరకుఁ బెండ్లికూతునకు రెండు కంకణములైనఁ దీసికొని రాఁగూడదా? ఆభరణములు రుద్రాక్షలా? నా పుత్రిక సన్న్యాసిని కాదే.'

నారదుఁడు:-రాణీ! నే నసత్యము లాడువాఁడనుగాను. సతి నిజముగ రాజరాజేశ్వరియైనది. కాని యిప్పు డేమిచెప్పిన నేమి లాభము? కొంచెమోపికఁబట్టియుండుఁడు. అప్పుడు నేను చెప్పినదంతయు యథార్థ మగును. మన సతిని భర్తృగృహమున కేఁగనిమ్ము. నీ యల్లుని మహదైశ్వర్యమును గాంచెదవు.

ఈ వాక్యముల వలన రాణియు మిగిలిన వారును గొంతవఱకుఁ దృప్తినొందిరి. కాని, దక్షుఁడు, అల్లుని వేష భూషణములఁ గాంచియు, ఆయన యనుచరుల రూపురేఖావిలాసములఁ జూచియు, అసంతుష్టచిత్తుఁ డాయెను. ఆయన యల్లుంపెండ్లిలోఁ గొందఱు గుఱ్ఱముల నెక్కియు, మరికొంద ఱేనుఁగుల, రథముల నెక్కియు వచ్చియుండిరి. కాని యీ పెండ్లికొడుకొక పర్వతమువంటి వృషభము నెక్కి వచ్చెను. వారివెంట బంగారు వెండి కఱ్ఱలను బూని సుందర వేషములతోడ ననేకులు భటులువచ్చియుండిరి. ఈ పెండ్లి వారియాకార వికారములఁ గాంచి కనకఖలవాసు లాశ్చర్యమును బొందుచు, 'ఈతఁ డెక్కడిరాజురా' యని కొందఱు హేళనముసేయుచుండ మరి కొందఱు వృద్ధులు 'కొండ ఱేఁడులిటులే యుందురు' అని ప్రత్యుత్తరం బొసంగుచుండిరి.

కాని, కైలాసనాథుని సదానందమగు మోము, చిరప్రసన్నమగు మూర్తిని, గాంచిన కొలందిని, పురవాసుల భావములు మారిపోయి యాయనయందు భక్తిగలుగుచుండెను.

సతియొక్క యానందమును వర్ణించుటెట్లు? సాధువులవలన సన్న్యాసులవలన, నెవరి చరిత్రను విని పరవశ యగుచుండెనో, ఎవరిని హృదయపీఠమం దుంచుకొని యనునిమేషమును బూజించుచుండెనో, అట్టి కైలాసనాథుఁడామెకుఁ బ్రత్యక్షముగఁ బతిరూపమునఁ బార్శ్వమం దున్నప్పుడు, ఆమె సంతసమునకు మేర యుండునా? సతి యింతకుఁ బూర్వమే కైలాసనాథుని పాదపద్మములయం దాత్మను సమర్పించి యుండెను. చంద్రమండలమునుధిక్కరించు నామోము, రజితగిరినిభ మగు నా శరీరము, యాజానులంబనములగునా బాహువులు, ఆ విశాల వక్షస్థలము, నిందితారవిం

దములగు నాచరణములు, కాంచినంతనే యా
మె కైలాసపతి నుద్దేశించి మనంబునం దిట్లు
ప్రణామం బాచరించెను. 'ప్రభో! కైలాస
నాథా! తమరే సతికి ప్రభువులు. తమకొఱకే
సతి జన్మించినది. తమ కుపయుక్త మగు సహ
ధర్మిణి యగునటులు విధాత నన్ననుగ్రహిం
చును గాత!'

వివాహానంతరము సతీదేవి కైలాసధామ
మున కేఁగెను. ఆమె రాకవలనఁ గైలాస
మపూర్వ శ్రీ నిధరించెను. కుసుమములయం
దధిక సౌరభమును, విహంగ కూజితము
లయం దెక్కుడు మాధుర్యమును, గనుపట్ట
సాగెను. సన్న్యాసి యగు కైలాసపతి సతిని
వివాహమాడి సంసారి యయ్యెను. ప్రతి
విషయమందునను సతీదేవి పతికి యర్ధాం
గియై యలరారుచుండెను.

---



Adopted from SATI by BARADA KANTA MAZUMDAR

*Printed at the Sishu Press*

***65-1 Bechoo Chatterjee Street Calcutta.***

# ఆఱవ ప్రకరణము

---

ఋతురాజగు వసంతుని సమాగమము వలనఁ గైలాస మపూర్వ శోభావికాసము నొందెను. పత్రపుష్పవిహీనములగుతరులతలు నవకిసలయముతోడ సుశోభితములై యలరారుచుండెను. గిరివరము శుభ్రతుషార వస్త్రమును వీడి శ్యామ వర్ణ రంజితమగు దువ్వలునను ధరించెను. వివిధ వర్ణములతోఁగూడిన పుష్పగుచ్ఛములు, గిరిరాజు శరీరమంతటఁ బ్రకాశింపఁజొచ్చెను. మంచుగడ్డలు కఱగి వందలకొలఁది సెలయేళ్లై ఝురఝుర నినాదమునఁ గ్రిందికిఁ బ్రవహించుచుండెను. శీతమునకు భీతిల్లి యుష్ణ ప్రదేశముల నాశ్రయించిన జీవజంతువులు తిరిగివచ్చుటవలనఁ గైలాస

పర్వతము సజీవ మయ్యెను. కైలాసోప వనముల యందు, భ్రమర ఝుంకారము లును, కోకిల కూజితములును, శుకపికనినాద ములును, మారు మ్రోగుచుండెను. తరు లతలు, పశుపక్షులు మొదలగునవన్నియు, నాతని జననధారణంబొనర్చి నవసూత్న శ్రీ తోడ విలసిల్లుచుండెను.

కైలాసపర్వతోన్నత శిఖరము మీఁద మహాదేవుని శుభ్రస్ఫటిక నిర్మితంబగుమంది రంబుండెను. గొప్పగొప్ప దేవదారు వృక్ష ములామందిరమునుజుట్టి దానిని మరుగు పఱచుచుండెను. అచ్చటి ప్రదేశమంతయు నెటుఁజూచినను, స్నిగ్ధముగను, ప్రశాంతము గను, రమణీయముగనుండి, తపోవన గాంభీ ర్యముతోడ, నుపవన సౌందర్యము మిళిత మగుటవలన, నదితపస్సునకు, సుఖభోగము నకు ననుకూలముగ నుండెను.

ఆ ప్రాసాదమున కనతిదూరమందుఁ బ్రాచీన దేవదారువృక్ష మొక్కటి విరాజిల్లుచుండెను. అది శాఖా ప్రశాఖలతోడ నాకాశమునంటుచు, మిక్కిలి విశాలమై యుండెను. దాని క్రింద నొకదినము సాయంతనము వేళ మహాదేవుఁడును సతీదేవియుఁ గూర్చుండియుండిరి. అక్కడ నొక వనలత దేవదారు వృక్షము నాశ్రయించి ప్రాకుచుండెను. మంద సమీరణము మహాదేవదంపతులను బుష్పములతోడఁ బూజించుచుండెను. కైలాసపతి మస్తకమందు జటాజూటములును, కంఠమున రుద్రాక్షమాలలును, శరీరమందంతట విభూతి లేపనము, కటిదేశమందు వ్యాఘ్ర చర్మము, భాసిల్లుచుండెను. సతీ వేషభాషణములు పతి కనుకూలముగనే యుండెను. ఆమె కాషాయ వస్త్రమును గట్టుకొని కంఠమున రుద్రాక్ష మాలలును, కరముల రుద్రాక్ష వలయము

లును, ధరించియుండెను. కేశపాశము కటి ప్రదేశమాక్రమించి, శిలాతలమందు జీరాడుచుండెను. ఈదంపతులకెదురుగా నందిత్రిశూలమును ధరించి నిలుచుండియుండెను. అస్తమితభానుని యరుణకిరణములా దేవదంపతులమీఁదఁ బడుటవలన వారి మోములు దేదీప్యమానముగ వెలుఁగుచుండఁ గైలాసనాథుఁడు జీవుల సుఖదుఃఖములనుగూర్చి సతితోడ సంభాషించుచుండెను. ఆ సంభాషణను, తరులతలును, పశుపక్షులును నిశ్శబ్దముగనుండి వినుచుండెను. కైలాసనాథుఁడస్తమించుచున్న సూర్యుని జూపెనవ్రేలితోఁ జూపుచు సతీదేవి కిట్లనియె. 'దేవీ! ఇటుఁ జూడుము. జగత్తునంతయుఁ బ్రకాశవంతముగ జేసిన సూర్యుని తేజస్సేవిధముగఁ దరిగిపోవుచున్నదో కాంచుము. ఇఁక రెండుమూఁడు నిమిషములలో సూర్యుఁడు తేజోవిహీనుఁడై

మన కదృశ్యుఁడగును. మానవజీవితముగూడ నదేవిధమునుమా? కాని, మానవుఁడు క్షణస్థాయినులగు సుఖదుఃఖములను శాశ్వతములని తలంచుచుండును.'

సతి:-ప్రభో! సూర్యునకువలె మానవునకుఁ గూడ నుదయాస్తమానములు గలవా?

కైలాసనాథుఁడు:-లేకేమి? జన్మమృత్యువులుదయాస్తమానములుగావా? ఉదయాస్తమానములవలన సూర్యుని తేజస్సునం దేవిధమగు మార్పుగలుగదు. కాని మానవజీవితమట్లుగాదు. మానవుఁడు ప్రతి జన్మమందును, జ్ఞానోన్నతిని బొందుచుండును. కేవలము ధర్మవిహీనులగు వారుమాత్రమే యధోగతుల నొందెదరు.

సతి:-అధర్మముగఁ బ్రవర్తించువారెప్పుడును, అధోగతి పాలుకావలసినదే?

కైలాసనాథుఁడు :- అట్లనుటకు వలను గాదు. జీవునకు శివునకు భేదములేదు. సత్కర్మానుష్ఠానమువలన జీవుఁడు పాపవిముక్తుఁడై యనంతోన్నతిని బొందును. లేక శివత్వము నొందును.

ఇట్లు సంభాషించుకొనుచుండ దూరమునుండి వీణారవము వారి వీనులకు విందు గొలుపసాగెను. ఆగానము సతీదేవికిఁ జిరపరిచయమైనది. కాన వెంటనే యామె భర్తను జూచి ససంభ్రమముగాఁ డ నారదుఁడు వచ్చుచున్నాఁడని నుడివెను.

ఇట్లనుకొనుచుండునంతలో దివ్యతేజోమయమూర్తియగు నారదుఁడు, వీణా సంయోగమున హరినామమును గీర్తింపుచు, వారి సమ్ముఖమునకువచ్చియేకాసనముమీఁదఁ గూర్చున్న సతీ కైలాసనాథులఁజూచి చరితార్థుఁడాయెను. అప్పుడు వారి గుణగానముచేయ

నారంభించెను. ఆ గానమువలనఁ గైలాస
మందలి చరాచరములన్నియుఁ బరవశము
లయ్యెను. వీరు పరస్పరము ప్రేమా లింగ
నము లొనర్చుకొని నారదు నుచితాసనా
సీనుం జేసిరి. పిమ్మట సతి యిట్లనియె:- దేవర్షీ!
కనక ఖలవార్తలేమి! నా తలిదండ్రులు క్షేమ
ముగనున్నారా? నాతోఁ బుట్టువులకు క్షేమ
మా? దాసీదాసజనములు పౌరులు మొద
లగు వారందఱుఁ గుశలమా?

నారదుఁడు:- అమ్మా! అందఱు క్షేమము.
నీ తలిదండ్రులు మొదలగు వారందఱు కుశల
ముగ నున్నారు.

సతి:-నన్నొక మారైనను మానాయన
చూచి పోకుండుటకుఁ గారణమేమి;

నారదుఁడు:-అమ్మా! సతీ! దక్ష ప్రజాపతి
మిక్కిలి తొందర పనులయం దున్నాఁడు.
ఆయన మహాయజ్ఞమొక దానిని జేయఁదలఁచి

నాఁడు. అందువలన తీరిక లేకుండవచ్చును. భారతవర్షమందలి ధనికులు దరిద్రులు పండితులు, మూర్ఖులు, అను భేదములేక యెల్లరనాహ్వానించుచున్నాఁడు. కాఁబట్టి నీక్షేమ సమాచారమునుగనుగొనుట కాయనకు వ్యవధిలేదను కొనుచున్నాను.

సతి యీ వాక్యములువిని పరమానంద భరితయై బాల్యస్మృతితోడ కనకఖలపట్టణ మందలి తరులతా గుల్మములుచూడఁ బ్రత్యుత్సుకమగుచుండ నిట్లనియె. 'దేవర్షీ! నన్నుఁ దీసికొని పోవుటకే కదామీరువచ్చితిరి ?'

నారదుఁడు:-అమ్మా! నేనిచ్చటకు వచ్చు సంగతి వారికిఁదెలియదు. నిన్నుచూచి చాల దినములైనది. అందువలన నీమార్గమున నేఁగుచు నిటువచ్చితిని.

సతి :- యజ్ఞమునకు మక్మేల పిలువ లేదు ?

నారదుఁడు:-నే నేమి చెప్పుదు నమ్మా! నీ తండ్రికిఁగొంచెముచిత్తచాంచల్యముగలిగినది. యజ్ఞమునకు మిమ్మాహ్వానించఁడని విన్నాను.

ఈమాట వినినంతనే సతి యాశ్చర్య మొంది నిమేషకాలము మౌనమును ధరించి యుండి పిమ్మట నిట్టూర్పువిడచుచు నిట్లనియె. 'దేవర్షీ? మేమొనర్చిన యపరాధమేమి?'

నారదుఁడు:-కైలాస నాథుఁడాయన నవ మాన పఱచినాఁడఁట. అందునకుఁ బ్రతీకార ముగ మిమ్మా యజ్ఞమునకుఁ బిలువఁడని విన్నాను.

సతి:-అమ్మ కీసంగతి తెలియునా?

నారదుఁడు:-తెలియును. ఆమె మిమ్మా హ్వానింప వలయునని యనేక విధములఁ బ్రార్థించెను. కాని ప్రజాపతి యామె మొరను చెవినిబెట్టలేదు. ఆమె యేమిచేయును? కా వున నన్నము నీరుముట్టు కొనక యుపవసించు

చున్నది. అమ్మా! సతీ! ఇఁక నీ ప్రసంగము వలనఁ బ్రయోజనములేదు. నాకువేఱు పని యున్నది. కావున నే నేఁగుచున్నాను.

అనినుడువుచు నారదుఁడు వెడలిపోయెను.

సతీదేవి కైలాస నాథునిజూచి యిట్లనియె. 'ప్రభో! మాతండ్రి ని మీ రెప్పు డవ మానపఱచితిరి?'

కైలాస నాథుఁడు:- దేవీ! నేనాయన నవ మానపఱచలేదు. ఆయననేకాదు, ఎవరిని గూడ నవమానపఱచుటనాస్వభావముగాదు. కొలఁదికాలము క్రిందట దేవగణముతోఁడ నే నొక సభ కేఁగితిని. అప్పుడక్కడకు దక్ష ప్రజాపతివచ్చెను. ఆయన వచ్చినంతనే సభా సదులెల్లరు నిలచి యాయనను గౌరవించిరి. నేనట్లు గౌరవించ లేదుకాని మానస మందు మిక్కిలి గౌరవించితిని. అప్పటినుండియు దక్షప్రజాపతి నాయందా గ్రహగ్రస్తుఁడై

యున్నాఁడు. మరియు నన్నవమానించుట కుపాయ మన్వేషించు చున్నాఁడఁట. నీకుఁ గష్టముగనుండునని తలఁచి యీవిషయ మిన్ని దినములుగఁ జెప్పకుంటిని.

ఈమాటలు విని సతి విచారనిమగ్నయై ముహూర్తకాలము మౌనమును ధరించి యుండి తిరిగి భర్తనుజూచి యిట్లనియె,

'ప్రభో! ఇప్పుడు నాకర్తవ్యమేమి?'

కైలాసనాథుఁడు:-'పరమానందముతోడఁ బతిసేవ నేయుచుండుటయే నీకర్తవ్యము' అని చిరునవ్వు నవ్వుచు నిట్లనియె. 'నేను యజ్ఞమునకేఁగిన యెడల నీ వసంతుష్టచిత్త వగుదువుగదా! అటులే నీవు యజ్ఞమున కేఁగిన యెడల నేను శాంతచిత్తమున నుండఁ జాలను. కావున మనమిరువురము పరమానందముగ నిచ్చటనేయుందము. ఇది యేమన కర్తవ్యము.'

సతి :- ప్రభో! భర్త యజ్ఞ భాగము నుండి వంచింపఁబడి, దేవసమాజచ్యుతుఁడై నప్పుడు, భార్య సహించి యెట్లూరకుండఁ గలదు?

ఇట్లనుచు సతి సజలనయనములతోడఁ గైలాసనాథుని వంకఁజూడ సాగెను.

కైలాసనాథుఁడు:- దేవీ! నాకు యజ్ఞభాగ మెందులకు? దేవసమాజ మెందులకు? నేనన్నిటిని బరిత్యజించితిని. మఱియు నాకైలాసము, కైలాసేశ్వరియగు సతి యక్షయముగనుండ నాకేమికొదువ? అందువలన దక్షుఁడుచేసిన కార్యములకు సంతసించుచున్నాను.

సతి:- ప్రభో! మీరు సంతసింపవచ్చును. కాని, నేను మిక్కిలి వగచుచున్నాను. తమ రాజ్ఞయొసంగిన యెడల కనక ఖలమున కేఁగి పతియవమానమును, తండ్రియమంగళమును దీర్చివత్తును.

కైలాసనాథుఁడు:- దేవీ! అది యసంభవము. నీవు నీతండ్రి ప్రకృతి నెఱుంగవు. ఆతఁడహంకార బధిరుఁడు. సదుపదేశము లాయన కర్ణములఁజొరవు. కావున నీ వేఁగుట వలన నణుమాత్రమైనను బ్రయోజనము లేదు. మీఁదు మిక్కిలి ప్రమాదము గలుగ వచ్చును.

సతి:- ప్రభో! నా కేఁగుట కనుజ్ఞనిండు. తండ్రివలన భర్తకుఁ గలిగిన యవమానమును సహించి యేస్త్రీయుండఁ గలదు? ఒక వైపున భర్తకు మానహాని, రెండవ వైపున దండ్రి కమంగళమును దెలిసికొని నిశ్చింతగనుండు టెట్లు? కావున నా కేఁగుట కనుజ్ఞ నొసంగుఁడు. నాతండ్రి పాదముల మీఁదఁబడి యా యవమానమును దొలఁగించెదను.

కైలాసనాథుఁడు:- దేవీ! విపరీతఫలము గలుగవచ్చునని తోఁచుచున్నది. నీ వవమానమును దూరముసేయుట కేఁగి యవమాన

మందుఁ బడిపోయెదవు. దానిని సహింపఁ జాలవు. కావున నీ ప్రయత్న ముడుగుము. మన మిర్వురము కైలాసమందు మహాసుఖముగఁ గాలము గడుపుచుందము. సతీ! నీతండ్రి ధనాంధుఁడు. నీ భిక్షువేషమును జూచి తన్న వమానించి నల్లించుకొనును. అందువలన నన్ను నిందించును. నీ వానిందా వాక్యములను విని సహింపఁ జాలవు.

సతి:-నాకైశ్వర్యమున కేమి కొఱంత? కుబేరుఁడు ధనాగారాధిపతియై యుండ, విశ్వకర్మ శిల్పియైయుండ, నాకైశ్వర్యమునకు లోపమా? ఆజ్ఞయైన యెడల మహదైశ్వర్యము తోడనే యేఁగుదును.

దక్షుఁ డవమానించునని చెప్పినప్పుడు, సతీదేవి నన్నవమానించు వా రెవరని తర్కించి, కాళీ, భువనేశ్వరీ, కమలా, మొదలగు దశమహా విద్యల స్వరూపమును జూపి

కైలాస నాథుని సంశయ నివృత్తిఁ జేసినని యొకపురాణ కథగలదు.

కైలాసనాథుఁడు:-నామాట వినుము. నీ వేఁగవలదు. యజ్ఞపరిణామము, నీకుఁగాని నాకుఁగాని, దక్షునకుఁగాని, క్షేమదాయకముగ పరిణమించుటలేదు. ఆ మన సన్నవమానించుటకే ఈయజ్ఞమును తలపెట్టియున్నాఁడు. నీవు బంధువని పేరంటమునకేఁగి చెడుదు. నామాట వినుము.

సతి:-ప్రభో! పుట్టినింటికేగుట యవమానము గావలయునా? నాతండ్రి నాకై యుపేక్షించుచున్నాడని దేవర్షి చెప్పెనుగదా! ఆవిషయము నన్ను బాధించుచున్నది. మరియు, నాకవమాన భయము లేదు. నాతండ్రి నన్నవమానించునా? అవమానించినను నాకుసమ్మతమే. భర్త్రవమానమును బోఁగొట్టఁజాలని భార్యయొక్క సతీత్వ మాహాత్మ్యము వృథాగదా?

మరియును మిమ్ము యజ్ఞమున కాహ్వానించిన యెడల తండ్రియజ్ఞ పరిణామము మంగళ ప్రదమగును. భర్త్రవమాన కళంకముమాసి పోవును.

కైలాసపతి:- దేవీ! నీయిష్టము. నీవేఁగ వచ్చును. కాని, సంగతి సందర్భముల ననుసరించి ప్రవర్తింపుము. నాకనుమానముగ నున్నది. యజ్ఞపరిణామము క్షేమదాయకముగఁ దోఁచుటలేదు.

అని సతీదేవికి సెల వొసంగి కైలాసనాథుఁడు తపోనిమగ్నుఁడాయెను.

---

## ఏడవ ప్రకరణము

---

'సతివచ్చెను.' 'సతివచ్చెను.' అను వార్త కనక ఖలమందంతటను వ్యాపించెను. దివ్యతేజోమయా మూర్తియగు సతిని దర్శించిన వారెల్లరు భక్తిభరమునఁ బ్రణామంబులాచరించిరి. సతి యెవ్వరితోడను మాట్లాడక సరాసరి దక్షుని సౌధరాజమును జొచ్చి తల్లి గదిలోనికేఁగెను. ప్రసూతి యచ్చట నిద్రాహారముల మాని నేలమీఁదఁబడి రోదనము సేయుచుండెను. సతి యామెకడ కేఁగి మృదుమధుర స్వరమున 'అమ్మా! వచ్చిన దెవరు?' అని నుడువుచు నామె నానుకొని కూర్చుండెను.

ప్రసూతి కర్ణములకీ వాక్యము లమృతోపమానములై యులికిపడి లేచి పుత్రికను గాంచి, గాఢాలింగన మొనర్చుకొని, వక్షస్థలమం దదుముకొని 'అమ్మా! వచ్చినావా; ఈజన్మకు నిన్నుఁ జూచెద ననుకొనలేదమ్మా!' అని వాత్సల్య రసమున సతీదేవిని స్నానము జేయింపుచు, ముద్దిడుకొనసాగెను. వారిర్వురి నేత్రములనుండి యానందాశ్రువులు వెల్లివిరియుచుండెను.

ఇట్లొకటి రెండు నిముసములు గడచిన పిమ్మట సతి యిట్లనియె. 'అమ్మా! నాయనను జూచివత్తును.' అని ప్రసూతి కౌఁగిలినుండి తప్పించుకొన నామె తిరిగి సతిని గట్టిగఁబట్టుకొని 'అమ్మా! వలదు. ఆయన యజ్ఞమంటపమందున్నాఁడు. నీవచ్చటి కేఁగవలదు. పిమ్మట నాయనను జూడవచ్చును.' అని చెప్పుచుండ సతి 'కాదు, ఒక్కమాటు చూచి యిప్పుడే

వచ్చెదను'అని చెప్పుచు బలవంతముగ నామె కౌఁగిలినుండి తప్పించుకొని బయలుదేరెను.

రాజప్రసాద సమ్ముఖమందున్న విశాల దేశమందు, యజ్ఞశాల నిర్మింపఁ బడెను. యజ్ఞసందర్శ నార్థము లక్షలకొలఁది జనులు వచ్చియుండిరి. సన్న్యాసులు, సాధువులు, ఋషులు, మహర్షులు, దేవర్షులు, పండితులు, రాజులు, మహారాజులు, స్త్రీలు, మొదలగు వారు యజ్ఞశాల నిండియుండిరి. యజ్ఞశాల మధ్య వేదిక యమర్చఁబడెను. దానిపై ఋత్విక్కులు మండలాకారముగఁ గూర్చుండి యుండిరి. వారి మధ్యఁగూర్చుండి దక్షప్రజాపతి విరామములేక హోమము సేయుచుండెను. ఆ యుత్తాపమువలన నాయన మూర్తీభవించిన యగ్నిహోత్రుని పగిది నలరారు చుండెను. అగ్నిహోత్రుఁ డనేకజిహ్వాలతోడ జాజ్వల్య మానముగ వెలుంగు చుండెను.

పవిత్ర హోమధూమము నలుదిక్కులఁ బ్రస
రింపుచుండెను. అవిరతవేద గానమువలన
సభ్యులెల్ల రాకర్షింపఁబడి ముగ్ధులై కీలు
బొమ్మలవలె తలలూచుచుండిరి.

సతీదేవి యజ్ఞశాలను జొచ్చినంతనే ససం
భ్రమముతోడ సభ్యు లామెకు మార్గమును
విడుచుచుండిరి. ఆమె యిటునటుఁ జూడక
త్వరితగతిని వేదిక కడ కేఁగి తండ్రికి సాష్టాంగ
దండ ప్రణామంబాచరించి లేచి నిలచి
చేతులు జోడించుకొని యుండెను. ఒక్క
ముహూర్త కాలము ఋత్విక్కుల మోము
నుండి మంత్రములు వెడలకుండెను. హోతహ
స్తము లాహుతిని విడువకుండెను. కారణ
మే మని దక్షుఁడు కనులెత్తి చూడ సతి
సమ్ముఖమందుఁ గాన్పింప వికసితవదనుఁడై
'అమ్మా! సతీ! వచ్చినావా?' అని నుడివి కను
చూపులతోడ నామెను గాఢాలింగనంబొ

నర్చుకొనెను. సతీ మోమునందు మంద స్మితము తాండవం బాడఁజొచ్చెను. ఆహా! ఆదృశ్యము స్వర్గదృశ్యము గదా!

కాని, మరుక్షణముననే దక్షుని, ఆ భావము, ఆ చూపు, ఆ ప్రఫుల్లవదనము, మారిపోయి, మోమెఱ్ఱవడెను. కనులనుండి యగ్ని కణములు వెల్వడసాగెను. శరీరము కంపించుచుండ దక్షప్రజాపతి యిట్లనియె. 'సతీ! యజ్ఞమునకు నిన్నెవ్వరు పిలిచిరి? ఏల వచ్చితివి?'

ఈ మాటలు విషపూరిత బాణతుల్యములై సతీ హృదయమును విద్ధమొనర్చెను. ఆమె యెప్పుడును దండ్రినోట నిట్టి మాటలను విని యెఱుంగదు. కాని సతిపొంగి పొరలుదుఃఖమాపుకొని, 'నాయనా! మిమ్ముఁ జూచి చాలదినములైనది. అందువలన వచ్చితిని.' అని వచించెను.

కరుణారస పూరితములగు సతీ వాక్యములు, సభాసదుల హృదయములను గఱంచుచుండెను. కాని దక్షుఁడు కర్కశస్వరమునఁ దిరిగి యిట్లనియె. 'నీ వెందుకీ యజ్ఞమునకు వచ్చితివి? నిన్నెవ్వరును బిలువలేదే.'

సతి:-తలిదండ్రులఁ జూచుట కాహ్వానము గావలయునా? నా యంతటనే వచ్చితిని. నన్నెవ్వరును బిలువ లేదు.

దక్షుఁడు:-ఇవి దక్షప్రజాపతి పుత్రికనోట నుండి రాఁదగిన మాటలుగావు. అలజ్జావిహీనునిభార్య నోటరావలసిన మాటలు——.

అని యేమేమో పల్కుచుండ సతి చెవులు మూసికొని, 'నాయనా! అకారణముగ నాయన నేల దిట్టెదరు?'

దక్షుఁడు:-(మండిపడుచు) లజ్జాశూన్యుఁడనిన తిట్టుటయా? ఆకాశమే వసనము గాఁ గలవానిని లజ్జాశూన్యుఁడనిన తప్పేమి? అనా

చారుఁడగుటవలననేకదా, వానికి స్వర్గమందు స్థానము లేకుండెను. శ్మశానము, భస్మము, విషములయందు ప్రీతిగలవానిని లజ్జావిహీనుఁడనుట కేలసందియింపనలయును? మరియు నాతఁడు మూర్ఖుఁడు.

సతి:-తండ్రీ! లజ్జావిహీనుఁడు గానిమ్ము. మూర్ఖుఁడు గానిమ్ము. ఆయన నా ప్రాణవల్లభుఁడు. నాకు దేవుఁడు. కావున నకారణముగ నాయనను నిందింపకుఁడు. ఆనిందా వాక్యముల వినుటకంటె మరణమె నాకు సర్వవిధముల శ్రేయము.

ఈ మాటలు వినుచున్న కోలఁదిని దక్షుని క్రాగహ మినుమడింపఁ బండ్లు పటపట కొఱకుచు, 'దుర్మార్గురాలా?' అని నుడివెను.

అప్పుడు సతి యిట్లనియె. 'తండ్రీ! శాంతింపుఁడు. మమ్ము క్షమింపుఁడు. ఏదయిన నపరా

ధమును మేమొనర్చినయెడల దానికిఁ బ్రాయ
శ్చిత్తము లేదా?'

దక్షుఁడు:-ఉన్నది, లేకేమి: నీవు చచ్చు
టయే దానికిఁ బ్రాయశ్చిత్తము. నీవు చచ్చిన
ముహూర్తమునుండియు, నాయధమునితోడి
సంబంధము నాకుఁ దీరును. అప్పుడు నా
ద్వేషము నశించును.

సతి:-ఇదియా తమయాదేశము? తండ్రీ!
తమ యాదేశము నెఱవేరుగాత. నామర
ణమువలనఁ గాని తమకోపము చల్లారదా?

దక్షుఁడు:-చల్లారదు. అప్పుడుగాని యా
ఖలునకు నాకు సంబంధముతీఱదు.

సతి:-తండ్రీ! అటులే యగుగాత. నా
మృత్యువువలన మీరు రాగ ద్వేషరహితులై
మీయల్లుని యపరాధములమఱచి, ఆయనను
నిందింపకుండిన యెడల నాకు మృత్యువు
మహదానంద దాయకముగదా? తండ్రీ!

తమ యాదేశ మిప్పుడే పాలింతును. మీ నిశ్చితాభిప్రాయమంతయే గదా ?

దక్షుండు:-అవును. అదే నిశ్చితాభిప్రాయము. ముమ్మాటికిదియే. దక్షుని పాటల యందు ద్వంద్వార్థములుండునా ? 'నీవుచచ్చినంగాని నాకు శాంతిగలుగదు.'

దక్షుని వ్యవహారమునుగాంచిసభాసదులు నిర్విణ్ణులైరి. కొంతమంది యచ్చటనుండి లేచిపోయిరి. కైలాసనాథుని యను చరులు దక్షుని సంహరించుట కాతురులై సతిదేవి వంకఁ జూచుచుండిరి.

సతి తండ్రికి నమస్కరించి, యజ్ఞకుండ పార్శ్వమం దుత్తరాభిముఖయై యోగాసనముమీఁదఁ గూర్చుండి పయిట చెఱఁగు తోడమోము గప్పుకొనెను.

సభాసదులు రాతి ప్రతిమలవలెఁ జూచు చుండిరి. కాని యామె యుద్దేశ్యమును

గ్రహింపఁజాలరైరి. అందువలననెవ్వరామెను నివారించుటకుఁ బ్రయత్నింపకుండిరి. నందీశ్వరుఁడు మొదలగువారు త్రిశూలములనెత్తి యాతురతోడ 'అమ్మా ? అమ్మా' యని పిలుచుచుండిరి.

ఇట్లు చూచుచుండ ముహూర్తకాలములో నామె దేహమునుండి యపూర్వజ్యోతి వెల్వడెను. ఆ జ్యోతియెదుట హోమాగ్ని శిఖలు తేజోవిహీనము లయ్యెను. స్థానభ్రష్టత నొందిన దేవీప్రతిమవలె సతి భూతలశాయిని యయ్యెను.

---



Adopted from SATI by Barada Kanta Mazumdar

*Printed at the Sishu Press*

## ఉపసంహారము

కైలాసనాథునకు దర్పభంగము గలిగెను. నలుదిక్కులం జూచెను. సతి కాన్పించదయ్యె. అజ్ఞాతమగు నాశంకయొకటి యాయన హృదయమును బరితపింపఁజేయఁ జొచ్చెను. అందువలన నాతఁడు 'సతీ! సతీ' అని యఱచుచు నట్టిట్టు పరుగిడఁ జొచ్చెను. కైలాసమంతయుఁ దిరిగెను. గాలించి వెదకెను. కాని సతి యెక్కడ?

అప్పుడాయన కస్పష్టస్మృతివలన దక్షుని యజ్ఞము మాట జ్ఞప్తికి వచ్చి పరుగిడుచు, 'సతీ, సతీ' అని యఱచుచుండెను. ఆయన వెన్నంటి వీరభద్రుఁడు మొదలగు మహావీరులు వచ్చుచుండిరి. కనకఖలమును సమీ

మాశ్రయించెను—హిమాలయ శిఖరమున కేఁగి సతీ ధ్యానమందు యోగాసనాసీనుఁడయ్యెను!

సతి ప్రాణములు విసర్జించిన స్థలమందు చిన్నకోనే రొకటి నేటికిని గన్పట్టుచున్నది. భాగీరథీ మతల్లి యీ దేవదంపతుల పావనచరిత్రను, యుగ యుగాంతరములనుండి మానవజాతికి బోధించుచు 'సతీదేవి పతిభక్తి యుత్కృష్టమైనదా? లేక, కైలాసనాథుని పత్నీప్రేమ యుత్కృష్టమైనదా?' అని ప్రతి యాత్రికుని ప్రశ్నించుచుండును.

సంపూర్ణము.



పట్టణము: ఇండియా ముద్రాక్షరశాల.

